తమరియొద్దనుండి సందేశము నపేక్షింప లేదు. మఱియు నీ యాంగ్లేయదేశముఁ బరిపాలించిన మఱియేరాజును శక్తి వంచన లేకుండఁగ మీవిశిష్టాధికారముల రక్షించుటయందు నాకన్న నెక్కుడుజాగ్రత్తతోఁ బ్రవర్తింపకుండి నను రాజద్రోహి విషయములో నెవ్వానికిని విశిష్టాధికారములు లేవు. కాన నభియోగింపఁబడినవార లెవ్వరైన నిచట నున్నారో లేరో యను వృత్తాంతమును దెలిసికొనుటకై నే నిచటకువచ్చితిని" అని చెప్పెను.

అంతటను దృష్టిప్రసరింపఁజేసి వారి నెవ్వరి నటఁ గన్గొననేరక రాజద్రోహుల రక్షింపఁబ్రయత్నించిన యెడల సభ యన్యాయప్రవృత్తిగలదిగఁ బరిగణింపఁబడు ననియు, ధర్మానుసారముగ న్యాయస్థానము నారాజద్రోహుల వ్యవహారములు నిర్ణయింపఁబడుననియుఁ జెప్పి లెంథల్ (Lenthall) అను సభాధ్యక్షునివైపు తిరిగి రాజద్రోహు లెక్కడ కేగిరని ప్రశ్నించెను. మోకాలిపైఁబడి యాయధ్యక్షుఁ డీరీతిగ గంభీరవచనములఁ బల్కెను.

"ప్రభూ; ఈసభయొక్క భృత్యుండనగుటంజేసి యీసభామందిరమున సభానియమితరీతినిందక్క వేఱుమార్గమునఁ జూచుటకుఁ గన్నులుగాని చెప్పుటకు నాల్కగాని నాకు లేదు. కాన నేలినవారడిగిన ప్రశ్న కీజవాబు తక్క వేఱొకదాని నీయఁజాలనందులకు నన్ను క్షమింపవేఁడుచున్నాను."

రాజటుల పిమ్ (Pym) మొదలగుసభ్యులఁ బట్టుకొనుటకుఁ జేసిన ప్రయత్నములన్నియు విఫలములై లండనుపట్టణమున సంక్షోభమును గలిగించినవి. పురవాసులచే రక్షితులైన వారలను బట్టణమునఁ బట్టుకొనఁ బ్రయత్నించెను గాని రాజటులైన సఫల మనోరథుండు కాలేకపోయెను. మఱియుఁ బురజను లాతని కవమానముం గూడఁ గావించిరి. తాను గావించిన నిరర్థక ప్రయత్నములన్నియు నేమి చేటుమూడఁజేయునో యను భయముచే చార్లస్సుప్రభువు లండను నగరమునువదలి హాంటన్ కోర్టునకుం జనెను.

అటుతరువాతను బ్రజలు తమ స్వాతంత్ర్యమును గాపాడుకొనుటకు పృథముగ నేర్పాటులఁ గావించుకొనుచుండిరి. రాజమిత్రులు కొందఱు ప్రజల మనోనిశ్చయములను వారియేర్పాటులను గుర్తెఱింగిన వారలగుటచే రాజునకును బ్రజలకును గొంతవఱకు వైషమ్యము తగ్గునటులఁ బ్రయత్నముల సల్పి ప్రభువును గొంతవఱకైనను శాసనసభకు లోఁబడుమని ప్రార్థించిరిగాని యాతఁ డట్టి సుబోధకముల నిరసించి తాను బట్టినపట్టును వదలక ప్రజలతో యుద్ధము గావించుటకుఁ దగినయేర్పాటులం గావించెను.

# ఉపాయము

## పూడిపెద్ది వెంకటరమణయ్యగారు

ప్రణయభానూదయంబునఁ బద్మమట్లు
విరియునీముఖసమ గన్పించునేని
నతులితానందమునఁ దన్మయత్వమంది
కరఁగి నిలువెల్ల నే నొకసరసినగుదు.

* * * *

ప్రణయశారదచంద్రబింబంబుపగిది
నవ్వు నీముద్దుమోము గన్పడినయంత
నెగసి మిన్నంది మబ్బుతో నేకమగుచుఁ
గరఁగి తెల్లన నిర్మలాకాశ మగుదు.

* * * *

అందమొలికెడు నీదుముఖాబ్జసీమ
వికచనీరజమో, లేక విమలచంద్ర
మండలమొ పోల్ప రాకున్న మదిఁ దలంచి
యాకసమ్మున వాహిని నై చరింతు
ప్రవిమలాకాశమై నీటఁ బ్రతిఫలింతు
నంబుదశ్యామ! నా కుపాయంబు లేదె!

(రాధిక)




'మాతలి'

[వెనుకటి సంచిక తరవాయి]

## ఐరిషు స్వరాజ్యస్థాపనము

**1904** వ సంవత్సరమున సిన్ ఫెయినులయుద్యమము ప్రారంభించునప్పటికి ఐరిషువారనేకులు దేశీయవాదులు (నేషనిస్టు)గ నుండిరి. దేశీయవాదుల ప్రతినిధు లెనుబదిమంది ఇంగ్లీషు పార్లమెంటులో నైర్లండుకుగాను సభ్యులుగ నుండిరి. వీరియాదర్శమేమి యన కనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా మున్నగువానివలె నైర్లండునకు బ్రిటిషుసామ్రాజ్యముక్రిందనే సామంతస్వాతంత్ర్యమును క్రమేణ స్థాపింపవలె నని. ఈ యభిప్రాయమునకు తొలుత దేశమున నను వాద మెక్కుడు లేకుండినను తరువాత కొంతసహాయము పొడమసాగెను. కాని **1904** వ సంవత్సరము మొదలు **1914** వరకును నింగ్లండులో ప్రభుత్వమునడపిన ఉదారవాదులీ సామంత స్వాతంత్ర్యస్థాపన విషయమున జూపిన యశ్రద్ధవలనను నాలస్యమువలనను నైరిషువారికి ఆయాసపోయి మఱియొక విధమున తమస్వాతంత్ర్యమును సంపాదించుకొనవలెనని దృఢమతి పుట్టెను.

## జర్మనీయ మహాయుద్ధము

ఇంతలో యూరపులో జరిగిన జర్మనీయ మహాయుద్ధమువలన సందర్భములు మారిపోయినవి. ఈయుద్ధమున నింగ్లండునకున్ను తత్పక్షమువారికిన్ని కావలసినంత సహాయము చేయవలయునని ఐరిషు దేశీయవాదు లభిప్రాయపడిరి. కాని యీయభిప్రాయ మైరిషు జనసామాన్యమునకు సమ్మతముగా నుండనందున దేశీయవాదులకు దేశమున ననువాదము తగ్గిపోసాగెను. జనులమార్గ మొండును వీరిమార్గ మొండును నాయెను. అట్టి తరుణమున సిన్ ఫెయినులకు బలము హెచ్చి యైరిషువారికి స్వాతంత్ర్యాపేక్ష యినుమడించెను.

**1916**-వ సంవత్సరమున ఏప్రెల్ నెలలో ఈస్టరు పండుగ కాలములో డబ్లినుపురమున నొక రాజనిరోధము సంభవించెను. దీనికి నాధులు సిన్ ఫెయిను నాయకులు. వీరికి ముఖ్యసహాయము కార్మికసంఘమువారు. ఈరాజనిరోధమున కప్పటిలో నపజయము కలిగెను. కాని తరువాత సిన్ ఫెయినునకు ప్రాబల్యము హెచ్చెను. ఎట్లన నీనిరోధము నణచుటకు నింగ్లీషుప్రభుత్వమువారు గావించిన క్రూరకృత్యములు వారి కెగ్గుదెచ్చెను. అపుడింగ్లండున ఆస్క్విత్తుశిరఃప్రధానిగ నుండెను. అనేకులు వలదన్నను నాప్రభుత్వముయొక్క యుత్తరువు చొప్పున నిరోధనాయకులలో పన్నిద్దఱు తుపాకులతో కాల్చబడిరి. వీరిలో కార్మిక నాయకుడైన జింకన్నల్లి యనువాఁ డొకఁడుండెను. తరువాత మఱియొక జనానువాదిని విచారణ లేకయే ప్రభుత్వమువారు కాల్పించినందున జనుల కింగ్లీషువారియెడ నసూయయు స్వరాజ్యమునెడ నాసక్తియు స్థైర్యమున్ను హెచ్చెను. ఈసమయమునకూడ నైరిషు దేశీయవాదు లింగ్లీషువారికి యుద్ధమునకై సహాయము చేయవలయునని యభిప్రాయపడినందున ననేకులకు వీరియందు నమ్మికతగ్గిపోయి వారు సిన్ ఫెయిను పక్షము నంగీకరించిరి. ఐరిషు స్వరాజ్యము ననువాదించిన పెద్దమనుష్యులను కొందఱిని యింగ్లీషు ప్రభుత్వమువారు శిరశ్ఛేదనకు విధించినందున నైరిషువారికి దినదినమునకును 'ఆత్మనా ఽఽత్మాన ముద్ధరేత్' అను సనాతనధర్మము మనసున నంటసాగెను.

సిన్ ఫెయిను ప్రాబల్యము హెచ్చుటకు గారణము లింతటితో నిలిచినవికావు. బ్రిటిషు ప్రభుత్వమువారైర్లండున నిర్బంధయోధత్వము (కాన్స్క్రిప్షన్)ను విధించ నెంచియుండిరి. అపుడు జరుగుచున్న జర్మనీయయుద్ధమునకై సైనికులను జేర్చుటకు ప్రతి యైరిషు

వాడును సైన్యమున జేరి రణరంగమునకుపోవ సిద్ధుడుగా నుండవలెనని యొకచట్టమును ప్రచురించుటకు ప్రభుత్వ మువారుద్యుక్తులయిరి. ఐర్లెండులో నొకప్రదేశమైన అల్స్టర్‌లో ప్రబలులుగానున్న రాజవాదులుతప్ప మిగిలిన యైరిషువారెల్లరును నీ నిర్బంధమునునిరాకరించ నిశ్చయించుకొనిరి. రోమనుకాథలిక్కులలో ప్రముఖు లనేకులును నీచట్టమును నిరోధించుట కుద్యుక్తులయి సిన్ ఫెయినులతో నేకీభవించిరి. తమ యైకమత్యమును నిరూపించుటకు జననాథులందరును గూడి యొకసమ్మెకట్టును విధించిరి. ఈసమ్మెకట్టులో అల్స్టర్‌లోనిపనివారు తప్ప తక్కిన యైరిషుకూలీలందరును కలసిరి. ప్రముఖులుకొందరింగ్లండునకువచ్చి యచ్చటి యసహాప్రవృత్తి (నాన్ కో ఆపరేషన్) సంఘముతో నాలోచించి యన్నివిధములను నీచట్టమును నిరోధించుటకు కావలసిన కార్యక్రమమును చర్చించి నిశ్చయించుకొని మరలివచ్చిరి. ఈమహాత్ప్రయత్నమునుజూచి తాము నిర్బంధయోధత్వమును విధించినయెడల తమకే గౌరవహాని సంభవించుననితెలిసికొని యింగ్లీషువారాచట్టమును వదలుకొనిరి. ఇట్టివి మఱికొన్ని సంఘర్షములవలన నైరిషువారందఱును యుద్ధము ముగియునప్పటికి సిన్ ఫెయినుపక్షమువారైరి తొలి దేశీయవాదమునకు బలము శూన్యమయి తుద కది మృతప్రాయమై పోయెను.

## సిన్ ఫెయినునియమములు

పార్లమెంటుల మూలమున రాజ్యకార్యములను జరుపుకొను పశ్చిమదేశములలో నాప్రభుత్వసభలకునియామకమును గోరువారు తమ రాజ్యనీతిని ముందుగ ప్రచురించి నివేదించుట వాడుక. 1918 సంవత్సరమున డిసెంబరు నెలలో నైర్లెండున రాజ్యసభకు సభ్యనియామకము జరిగెను. ఈనియామకమునసిన్ ఫెయినులనేకులు సభ్యులయిరి. జర్మనీయ యుద్ధ మప్పుడే ముగిసియుండెను. ఈయుద్ధము విషయమున నైరిషు దేశీయవాదులు నడచుకొనిన విధమునుబట్టి యైరిషు జనసామాన్యము వారియందు నమ్మకలేనివారై సిన్ ఫెయినులనే రాజ్యసభకు నియమించిరి. అంతకుపూర్వ మెనుబదిమంది దేశీయవాది సభ్యులున్నచోట నిపు డెనిమిదిమంది కూడ లేరైరి. ఈనియామకమున డెబ్బదిమువ్వురు సిన్ ఫెయినులు రాజ్యసభలో సభ్యులయిరి. ఇందుకు కారణము యాక్రింద వివరింపబడిన సిన్ ఫెయిను రాజ్యనీతియే:—

(1) మేము బ్రిటిషుపార్లమెంటులో నికమీద నైర్లెండుకు ప్రతినిధులుగ కూర్చొనజాలము. ఐరిషు వారికిగా నన్యదేశీయులకు శాసననిర్మాణాధికారమెంతమాత్రముగానియుండకూడదనిమాయభిప్రాయము.

(2) సర్వప్రయత్నములను నైర్లెండుపైని యింగ్లండునకుండు నధికారమును తొలగింప జూతుము.

3. ఐర్లెండులోని సమస్త జనులవలనను నెన్నుకొనబడిన సభ్యులను నొక ప్రభుత్వసభగా గావించి యాసభ నైరిషువారి యార్థికసాంఘికవార్తక విషయములలో పురోవృద్ధి గావించుమార్గముల నవలంబించుటకు సర్వాధికారమును నారోపణచేయుదుము.

4. ప్యారిసులో (నపుడు జరుగుచుండిన) సంధిసభ నైర్లెండును స్వతంత్రదేశముగా భావించవలెనని విజ్ఞప్తిని పంపుకొనెదము

## ప్రజాపతి (రిపబ్లిక్) సభకూడుట

పైని వివరింపబడిన నివేదికలమీద సిన్ ఫెయిను నియామకములు జరుగునప్పటికి నియమింపబడిన సభ్యులనేకులు కారాగృహములలో నుండిరి. అయినను వీరియందుండిన నమ్మకచేతను గౌరవముచేతను జనులు రాజ్యసభకు వారి నెన్నుకొనిరి వీరిలో నిపు డైరిషు ప్రజాపతిసభ కధ్యక్షుడయియున్నట్టి 'డివెలెరా' యను నతడొకడు. అట్లు కారాగృహస్థులుగానుండని సిన్ ఫెయిను సభ్యులందఱును నియామకము జరిగిన తరువాత డబ్లినుపురవరమున సభచేరి 'డెయిల్ యెరియాన్' అనుపేర నైర్లెండునకు స్వతంత్రప్రభుత్వసభ యయిరి. సిన్ ఫెయినులు గాని యితరసభ్యులుగూడ నీసభకు రమ్మని ప్రార్థింపబడిరి. కాని దేశీయవాదులును అల్స్టరులోని రాజకీయులును నాసభకు జేరరైరి.

అట్టిసమయమున డివెలెరా కారాగృహమునుంచి తప్పించుకొని బయటవచ్చెను. అంతకుపూర్వము జరిగిన

మొదటి సిన్‌ఫెయినుసభలో నతని నైరిషుప్రభుత్వమున కధ్యక్షునిగ నియమించి యుండినందున నిపు డానియా మకము నీ 'డెయిల్ ఎయిరియన్' సభ దృఢపఱచెను. ఐరిషుప్రభుత్వసభ కధ్యక్షుడయిన డివలెర తన రాజ్య నీతిని యీ క్రిందరీతిని తెలియపఱచెను.

“ప్రజల కయిష్టముగ నీదేశమున రాజ్యముసల్పు చున్నవారిని మేము లెక్కపెట్టనేరము. వారి విషయ మున మేము కేవల మసడ్డతో వర్తింతుము. వారిచట్టములు మా దేశమున కెంత యావశ్యకమని మాకుదోచునో అంత వఱకే వానిని మే ముపయోగింతుము.” ఈయుద్దేశముల నామోదించి డెయిల్ ఎయిరియను సభ ఐర్లండునకు స్వతంత్రప్రభుత్వసభయయి సర్వాధికారమును గ్రహిం చెను. ఇదియే తొలుత ఆర్థర్ గ్రిఫితుకోరినదియును.

ఐర్లండులో ననేక సంవత్సరములుగ భూమికి చాల గిరాకియుండెను. ఇంగ్లీషువారి ప్రభుత్వముక్రింద సామాన్యజనులకు భూమి దొరకనందున జీవనోపాయము లేక వేలకొలదిజనులు దేశమును విడిచి అమెరికా మున్నగు దూరదేశములకు వెళ్లి యచట నునికిపట్లనేర్ప రచుకొనియుండిరి. జను లివ్విధమున దేశమును వదలిపెట్టి పోవుటవలన 1846-వ సంవత్సరమాదిగ నైర్లండులోని జనసంఖ్య తగ్గుచు వచ్చెను. సిన్‌ఫెయిను ప్రభుత్వము యొక్క భూవిభాగన్యాయముయొక్క ఫలముగ నైరిషు వారికి భూమి సులభముగ దొరక నారంభించినందున వారి ప్రభుత్వపు తొలియేటనే దేశమున జనసంఖ్య హెచ్చెను. వ్యవసాయముచేయువారికి సహాయముగ నీ ప్రభుత్వమువారొక గొప్ప నిధిని యేర్పాటుచేసి వారికి ఋణములనుగూడ నిచ్చిరి. ఈప్రయత్నమున సిన్‌ఫెయినువారికి బ్రిటిషుప్రభుత్వమువలన కొంత ప్రాతి కూల్యము కలిగెను. అయినను సిన్‌ఫెయినుల స్థైర్యమున నమ్మకము గలవారయి జనులు దేశముననే నిలిచి తమ స్థితిని బాగుపఱచుకొన సిద్ధులయిరి.

గ్రిఫిత్తుయొక్క యభిప్రాయముచొప్పున డెయిల్ ఎయిరియను అన్యదేశములలో నైరిషు ప్రశంసకుల నేర్పరుప దొడగెనని యింతకు పూర్వమే చెప్పియున్నాము. ఈప్రశంసకుల పనియేమన నాయాదేశములలో తమదేశమునకు వ్యాపార సౌకర్యముల నేర్పరచుకొనుట. ప్రపంచమందు ప్రసిద్ధిచెందియున్న పారిశ్రామికపురవరములలో నెల్ల నైరిషు ప్రశంసకులు స్థాపింపబడిరి.

గ్రిఫితుయొక్క మఱియొక గొప్పయుద్దేశమేమన దేశములోని యడవులను బలపఱచవలెనని జర్మనీతో జరిగిన యుద్ధమునకై యోడలను కట్టుటకు బ్రిటిషుప్రభుత్వమువా రైర్లండులోని యడవులనన్నిటిని నఱికించి కొయ్యయన్న మాటలేకుండఁ జేసియుండిరి. బోడిచేసిన యడవులకుమారుగ క్రొత్తయడవులను నిర్మించినవారు కారు. ఈపనినిన్ని డెయిల్ ఎయిరియను చేయ పూనుకొనెను. ఇంతయేకాక నైర్లండు చుట్టునున్న సముద్రమున జిక్కగలిగిన మత్స్యాదులను సేకరించి వాని నుపయోగించుటకును డెయిల్ ఎయిరియను బూనుకొనియెను. దేశములోని వాసగృహములను బాగుపఱచుటకుగూడ నీ ప్రభుత్వసభ ప్రయత్నముల జేయసాగెను.

## వృత్త్యుద్ధారణ

ఐర్లండులో నేయేవృత్తులకు నేయే సౌకర్యము లుండెనో యట్టివానికి సహాయము చేయనగునో దానిఁ దెలియుటకుగాను డెయిల్ ఎయిరియ నొక విచారణ సభను నిర్మించెను. ఈసభ దేశమునంతటను సంచరించి యాయాప్రదేశముల వృత్తిపరులను వృత్తినాయకులను గలసిమాటాడి యేయేవృత్తులకు నేయేసహాయసంపత్తులుండినవిన్ని వివరముగా తెలుసుకొననైయుండెను. ఈసభ చాల నుపయోగమైనపని గావించుచుండెను. అయిన బ్రిటిషుప్రభుత్వమువారు దీని ప్రాబల్యమున కోర్వఁజాలక దానిసంచారప్రచారములకు సంకటములగావించుచుండిరి. తుదకు దీనిని నిర్మూలముచేయు నుద్దేశముతో నిదియొక కుట్రకూటమని చెప్పి యెల్లవిధములను దీనికి నిబ్బందుల గలిగించసాగిరి.

స్థానికప్రభుత్వసభలును నితరసంఘములవారును దీనికి యేలాటిసహాయమునుగాని చేయరాదని ప్రభుత్వమువారు శాసించిరి. తుదకు 1920 వ సంవత్సరము జనవరి 21 తేదీన కార్కుపురముయొక్క పురసౌధములో

జరుగుచుండిన నీసభను ప్రభుత్వమువారు సిపాయిలచేత తుపాకులతో బెదరింపించి బయట తోలించిరి.

ఈ బెదరింపులకుగాని విఘ్నములకుగాని డెయిల్ ఎయిరియను జంకినదికాదు. బ్రిటిషువారు పెట్టు యిబ్బందులు హెచ్చినకొలదియును దీని స్థైర్యము మఱియు హెచ్చసాగెను. సిన్ ఫెయినుద్యోగస్థుల నందరను జేర్చి ఐరిషు నియోగముగా నేర్పరచిరి. ఈనియోగము (సర్విస్)నకధికారి డెయిల్ ఎయిరియనేకాని బ్రిటిషుప్రభుత్వముకాదు. అంతట బ్రిటిషుప్రభుత్వమువారు డెయిల్ ఎయిరియనుకూడ కూటసభయని చెప్పి యణగద్రొక్కసాగిరి: కాని యీసభ విడువక రహస్యముగనే కలియుచుండెను. డివలెరాను బ్రిటిషుప్రభుత్వమువారు ఖైదీ పట్టియుంచిరి. అతడు జైల్లో తప్పించుకొని యమెరికాకు వెళ్లి యచటి బలవంతుల యభిమానమును సిన్ ఫెయిను వారికిగా సంపాదించి డెయిల్ ఎయిరియనుయొక్క కార్యభాగముల కాధారముగ అప్పు సంపాదించెను.

ఐర్లండులో నెన్వరును ఐరిషు సిన్ ఫెయిను పార్లమెంటయిన డెయిల్ ఎయిరియనుకు ధనసహాయముచేయ కూడదని బ్రిటిషుప్రభుత్వమువారు నిషేధించి యుండిరి. డెయిల్ ఎయిరియనునకు దేశస్థు లిచ్చియుండిన యప్పు సంబంధమైన పత్రములు మున్నగువానిని రాజవిరోధమని చెప్పి వానిని నాశముచేయసాగిరి. డెయిల్ ఎయిరియనుపక్షమున నప్పుపరతులను ప్రకటించిన కారణమున నిరువది వార్తాపత్రికలను నిలిపివేయించిరి.

ఈయప్పునకుగాను దేశమంతటను తిరిగి పైకము ను వసూలుచేసినవారినిన్ని పైకమిచ్చినవారినిన్ని బ్రిటిషువారు కారాగృహముల కనుపసాగిరి. ఇంతటిలో నిలువకే సిన్ ఫెయినువారి ధనములుండిన నిధులను (బాంకులను) దౌర్జన్యముతో పట్టుకొని యాధనము నపహరించుటకుకూడ నీ ప్రభుత్వమువారు పూనుకొనిరి. అయితే నిధులయధికారులు తమ ధర్మమును వదలక నీ దౌర్జన్యము నెదిరించి మొండొడ్డి యాధనమునియ్యజాలమని ప్రతిఘటించిరి.

## ప్రజాపక్ష ధర్మాసనములు

న్యాయపాలనకై డెయిల్ ఎయిరియను ప్రజాపక్షధర్మాసనము (రిపబ్లికన్ కోర్టు)ల నున్ను భూమిని గుఱించిన తగాదాలనుతీర్మానించుటకు పంచాయతిసభల నున్ను స్థాపించెను. ఈధర్మాధికారుల తీర్మానములకనుకూలముల జరుపుటకు స్వంత పోలీసువారినిన్ని స్థాపించెను. అంతకు పూర్వమే యభిమానసేన (వాలెంటియరు) యొకటి స్థాపితమయి యుండెను. ఐర్లండులోని సర్కారు పోలీసువారు 1920 వ సంవత్సరమునుండి వారివిధియైన కావలిపనిచేయక ప్రభుత్వాధీనమయి సిన్ ఫెయినుల బాధించుచుండి జనవిరోధియై యుండెను. ఈకారణమున దేశమున దొంగదోపిళ్లు హెచ్చి జనులకు ప్రభుత్వమున్నదో లేదోయని సందియమును బుట్టించెను. అట్టి దురవస్థలో నీయభిమానభటులు నేరములెవ్వియును జరుగకుండ కావలి కాచుటవలనను నేరస్థులనుపట్టి శిక్షించుటవలనను మిక్కిలియు జనోపకారులయి జనులప్రీతి విశ్వాసములకు పాత్రమయి యుండిరి. వీరి కార్యక్రమములున్ను చాల ప్రశస్తములుగా నుండెను. నేరస్థులను వీరు ప్రజాపక్షపు పోలీసుకోర్టులకు గొనిపోయి యచట విచారణ యయినతరువాత వీరి కెద్దియైన నొక యుపయోగకరమయిన పనిచేయుటకు విధించువారు. ఆపనినిచేసి దానివలన సంపాదించిన ధనముతో తాము జేసినదోపిళ్ల నష్టములకు నేరస్థులు ప్రతిఫల మిచ్చినతరువాత వారిని ఖైదీలనుంచి విడుదల చేయువారు. గొప్పనేరములను జేసినవారిని విచారణయయి తీర్పు చెప్పినవెంటనే ద్వీపాంతర వాసమునకున్ను గొనిపోవుచుండిరి. కాలక్రమమున నింగ్లీషుప్రభుత్వమువారు తమ క్రింద పోలీసువారికి విధించుచుండినపనులు మినుమిక్కిలి హేయముగానుండినకారణమున నాపోలీసువారనేకులు లసూయచెంది రాజీనామాలియ్యసాగిరి. పోలీసువారువదలిపోవనారంభించినంతటనే బ్రిటిషువారి ప్రభుత్వముయొక్క బలము రూపుమాయక పడిపోయే దశాలు తగ్గిపోయెను. వారిదర్ప మడుగంటెను. వారియెడ దేశస్థులకు విశ్వాసగౌరవములించుకయయిన లేవయ్యెను. జనులకు స్వాభిమానము స్థైర్యము హెచ్చి స్వాతంత్ర్యము నెడలను స్వరాజ్యమునందును నభిరుచి మీఱసాగెను.

## సిన్ ఫెయినులు ప్రభుత్వము నాక్రమించుట

1920 సంవత్సరమున బ్రిటిషుపార్లమెంటుకుగా జరిగిన సభ్యనియామకములో సిన్ ఫెయినులే విశేష

ముగ నెన్నుకొనబడిరని పైన జెప్పియున్నారము. ఇదిగాక యైర్లెండులోని ప్రభుత్వశాఖలనన్నిటిని సిన్ ఫెయినుప్రాయముగ జేయవలయునని ఆర్థర్ గ్రిఫితుయొక్క యుద్దేశముగా నుండెను. దీనికి తోడుగ నాసంవత్సరమున జరిగిన స్థానిక ప్రభుత్వసభ్యనియామకములలో నూటికి డెబ్బదిమందికంటె నెక్కువగానే సిన్ ఫెయినులు సభ్యపదవికి వచ్చిరి. దేశమంతయును వీరి పక్షమయియుండెను. జిల్లాసభలు తాలూకాసభలు గ్రామసభలు పౌరసభలు మున్నగువాటి నన్నిటను సిన్ ఫెయినులు ప్రముఖులయియుండిరి.

ఏయే స్థానికసభలలో సిన్ ఫెయినులు ప్రబలులుగ నుండిరో నవియన్నియును బ్రిటిషువారి యధికారమును ధిక్కరించసాగెను. ఇంగ్లీషు పార్లమెంటును జనుచేయక డెయిల్ ఎయిరియనునే వారు సర్వాధికారిగ నంగీకరించిరి. ఈసభలు జరిపించిన తీర్మానములు మున్నగునవి డెయిల్ ఎయిరియను క్రింది స్థానిక ప్రభుత్వస్వత్వునికే తెలుపబడి యతని యుత్తరువుల చొప్పుననే యవియు జరుగుచుండెను. ఇందుకు బదులుగ బ్రిటిషు ప్రభుత్వమువారీస్థానికసభలకు మునుపటివలె ధనము నిచ్చుట మానివేసిరి. కాని జను లాధనసహాయము లేనందున కలిగిన యిబ్బందుల నుత్సాహముతో నోర్చుకొని యుండిరేకాని బ్రిటిషువారి కనుకూలులు కారైరి. కొంతకాలముమాచి బ్రిటిషువారు ధనమునియ్యనిచో వారికి పన్నులను చెల్లించకూడదనియు జనులు నిశ్చయించుకొని యుండిరి.

## పంచాయతిసభలు

సిన్ ఫెయినువారు తమ ధర్మాసనముల వలనను పంచాయితి సభలవలనను కావించిన ధర్మపాలననుగురించి ఫిగ్గిన్సు అనునొక ఐరిషు గ్రంథకర్త యీక్రింది యభిప్రాయములను వ్రాసియున్నాడు.

"ఈప్రజాపక్షధర్మాసనములు జనులకు సమ్మతములయి యున్నయవి. వానియెడ జనులకుగౌరవము దినదినమునకు హెచ్చుచున్నది. కావున వాని ప్రాబల్యమున్ను హెచ్చుచున్నది. భూమితగాదాలను విచారించు ధర్మాసనములున్ను పంచాయతి సభలున్ను నిష్పక్షపాతముగను ధైర్యముతోడను జరిగించు తీర్మానములు జనులకు గౌరవనీయములయి వారిచే శిరసావహింప బడుచున్నవి. భూమితగాదాలు మునుపటివలె ఘోరములై యుంటలేదు. అన్యాయాక్రమణలు చాల తగ్గిపోయినవి. భూమియోయను పూర్వపుఘోష యిపుడు చెవికి దూరమయిపోయినది! సమిష్టికి సిన్ ఫెయినులు స్థాపించిన ధర్మాసనములు న్యాయపాలనకు పేరుపడినవి యని వారికి ప్రతికూలములయిన వార్తాపత్రికలుకూడ స్తోత్రము చేయసాగెను. ఈధర్మాసనములకు ముఖ్యసహాయకర్తలు ప్రజాపక్షమునకు జెందిన పోలీసువారును నభిమానభటులును. వీరు తమ జాగ్రతవలన నేరములను కనిపెట్టుచును యితరవిధముల జనులక్షేమమును కాపాడుచును సిన్ ఫెయిను ప్రభుత్వమునకు మంచిపేరు దెచ్చిరి.

ఇదిమాత్రముగాక సిన్ ఫెయినులు దేశములోని త్రాగుబోతుతనమును నణచుటకు పూనుకొనిరి. బ్రిటిషుప్రభుత్వముక్రింద జనులెంతత్రాగినను నాక్షేపణలేకయుండెను. ఏలయన దీనివలన వారికి సారాయి మున్నగువాని మీద నెక్కుడుపన్ను వసూలగుచుండినది. జనులకు సన్మార్గముల గఱపుటకున్ను దుర్మార్గముల ధనవ్యయమును మాన్పుటకున్ను బీదసాదలు దివాలెత్తక యుండుటకున్ను సిన్ ఫెయినులు త్రాగుబోతుతనము నాప సకల ప్రయత్నములను జేయుచుండిరి. వారధికారపదవికి వచ్చినవెంటనే తొలుత దొంగతనముగ సారాయిని దింపుటను నిలిపించిరి. సారాయిగిడ్డంగులను కొద్దికాలమే తెఱచియుండవలెనని యుత్తరువు చేసిరి.

వీరిట్లు జనాభివృద్ధికై పనిచేయ సాగినంతటనే రాజకీయప్రభుత్వమున్ను ధర్మాసనములున్ను నిందకు పాత్రములు కాసాగెను. ఆధర్మాసనములకు న్యాయమునపేక్షించి పోవువారే లేకపోయిరి. జనులచ్చటికి రానందుల కచ్చటి న్యాయపతులు జనులనుతిట్టి వారిపై వృథా కోపములజేసి తమయెడ వారు చూపిన యశ్రద్ధకును నగౌరవమునకును కోపించుకొనసాగిరి. కాని దీనివలన నేమిఫలము? రాజకీయ ప్రభుత్వమున కంటియుండిన నిప్పు బాగుగ నిపుడు రాజసాగెను. కొలది కాలములోననే నది ప్రజ్వరించి రాజకీయ ప్రభుత్వమునంతటిని భస్మసాత్కరించుటకు సిద్ధమయియుండెను. ఎంతటి మూఢజనులయినను తమ సంకెళ్లను తామే తొడుగు

కొందురా? వారొప్పుకున్న వారి నితరులు పరిపాలింప నలవియగునా? అది యంతయు కల్ల.

### సమ్మెకట్టు

పాశ్చాత్యుల సాంఘిక ఆర్థిక వ్యవహారములలో సమ్మెకట్టుల యుపయోగము చాలగొప్పది. బలవంతులని యెంచిన ధనికులను వర్తకులను వారిలాభములనే యాపేక్షించు ప్రభుత్వములను ముక్కుకుత్రాడువేసియొంటెను వంచినట్లు వంచునది యీసమ్మెకట్టు. దీనికి ముఖ్య ప్రాణము ఐకమత్యము. ఐరిషువారికి బ్రిటిషు ప్రభుత్వమువారిపద్ధతు లేనాడు సహింపరాని వాయెనో నాటినుంచి యీసమ్మెకట్లు హెచ్చసాగెను. జనుల కిబ్బందుల దెచ్చునట్టియు, వారిని నిర్బంధించునట్టియు చట్టములను ప్రభుత్వమువారు నిర్మించినపుడెల్లను జనులీవిధమున తమ యధికారనిరాకరణమును ధిక్కారమును జూపువారు. ఐర్లండులోని ప్రతినరుడును జర్మనీతోటి యుద్ధమున పోరుటకు యోధుడుకావలెనని ప్రభుత్వమువారు నిర్బంధపు చట్టమును ప్రకటింపనున్నపుడొకనాడు దేశమునందంతటను పనులన్నియును సుగ్రీవాజ్ఞకు నిలిచినట్లు నిలిచిపోయెను. అల్స్టరులోతప్పతక్కినచోటులలో నెక్కడగాని యానాడు కాసెత్తుపని జరుగలేదు. ఇరువదినాలుగుగంటలకాల మైర్లెండుదేశమునంతటను మూసినయంగళ్లు మూసియేయుండెను. యంత్రశాలలు ప్రాణశూన్యములయి యాతనాశకీశములవలె నుండెను రైలుబండ్లును ట్రాంబళ్లును సెలవుదీసికొనిన ట్లుండినవి. ఓడకట్టుస్థానములలో నొక్క కూలివాడయినను కానరాడయ్యెను. పూటకూళ్లయిండ్లలో జీతగాండ్రు గైరుహాజరు. పాఠశాలలో నుపాధ్యాయులున్నను; బాలురంతకుమునుపే బండిసున్న. ఇట్లు నడచుకొని నిర్బంధయోధత్వమునకు తామొల్లమని జనులు యేకవక్త్రందిన్ని తెలియజేసిరి. అపుడు ప్రభుత్వమువారు మేల్కొని యానెత్తిచట్టమును విప్పక దూలముమీద పెట్టివేసిరి.

---

# ప్రణయచింత

మల్లాది సోమన్నగారు

ఈవనము యీతోపు
అన్నిలోయలు గుహలు
పల్లు పూపొదరిండ్లు
ఎన్నెన్ని తిరిగినా
ఈ భావమే వచ్చుగా,
దైవమా,
యిటులనే వేధింతువా!

చిగురుటాకులమోవి
చిన్నారి నా నాతి
మనసు వ్రక్కలు చేసె—
మది ధైర్యమును బాసె
దుఃఖానలము నార్పవా,
దైవమా,
దోసిలొగ్గుచు నుంటిరా!

ప్రణయవీచికలన్ని
ప్రజ్వరిల్లుచు లేచు
ప్రతిఫలిత బింబ చుం
బనమునకు మదియందు
తెరు వికేలనో తెల్పవా,
దైవమా,
దీనుడను రక్షింపవా!

భావి కాముక భ్రమలు
భంగంబు లయిపోయె
ప్రవిమలాత్మయు ప్రళయ
పవనఘాతమునందె
తిమిరవాహినినుండి నే,
దైవమా,
తేలుమార్గము లెవ్వియో!

ఏషియాటిక్కు పెట్రోలియముకంపెనీ కిరస ఆయిలుడిపో-కాకినాడ



సి. బసవరాజు అంచు సన్నువారు తీసిన ఛాయాచిత్రము [రెండవబహుమానము]



౨. గరుడోత్సవము-ధర్మవరము

శ్రీ యమ్. కే. కాళేంగా పుతీసిన ఛాయాచిత్రము. [మూడవ బహుమానము]



౧. పగలంతయు పనిచేసినతర్వాత

శ్రీ చావలి సత్యనారాయణగారు తీసిన ఛాయాచిత్రము–రాజమహేంద్రవరము

[మొదటి బహుమానము]



# కోతులభాష

శ్రీమతి గుడిసేవ నాగమణి దేవిగారు

ఈవిజ్ఞానయుగమున మనకెన్నియో అద్భుతవిషయములు అనుభవమునకు వచ్చుచున్నవి. ఆర్యనాగరకత ఉన్నతశిఖరమున నున్నపుడు ఆర్యులు తమబుద్ధిబలము చేతను,నిరంతర కర్మపరాయణత చేతను ప్రకృతిని తమకు దాసినిగా జేసికొని ఎన్నియో ప్రకృతి రహస్యములను వెల్లడిపఱచినట్లు మనకు పూర్వగ్రంథములవలన తెలియుచున్నది. సింధు హైదరాబాదులో నొక మహమ్మదీయునివద్ద నొకగొప్పపురాతన పుస్తకాలయమున్నదనియు జర్మను మున్నగు దేశీయులు దానిని చాలధరపెట్టికొనగోరగా ఆయన అందుకియ్యకొనక సమర్థులెవ్వరేని లభించిన భారతీయులకే దానిని అమ్మెదననియు చెప్పినటుల 'కర్మవీర్', అనునొక హిందీపత్రికలో నొకరు వ్రాసిరి. ఆగ్రంథాలయములో వాయువార్తలు, విమానములు మున్నగు అధునాతన అద్భుత విషయములను సూచించు గ్రంథములెన్నియో కలవట. ఆహా! ప్రవృత్తినివృత్తి మార్గముల పారంగతులైన ఆర్యసంతతి వారు నేడు కట్టుకొను గుడ్డకూడ విదేశములనుండి తెప్పించుకొనవలసిన దుస్స్థితి వచ్చినది. మన పూర్వులలో పెక్కుమంద పశుపక్ష్యాదులతో స్వేచ్ఛగా మాటాడగలవారు ఉన్నటుల మనము మనపురాణాదులలో చదువుచున్నాము. కాని యిప్పుడెవ్వరును అట్టివారు ఉన్నటులు గనుపట్టదు. నిరంతర ప్రకృతిశోధనాపరులగు యూరోపువాసులు ఇప్పటికి యద్భుత విషయములను క్రియారూపమున జూపుచున్నటులు మనకు ఆంగ్లేయపత్రికలవలన తెలియుచున్నది.

డాక్టరు గార్నరు ఆఫ్రికా అడవులయందు కోతులభాషను నేర్చుకొనెను. మిస్ సిమోట్స్ పేరుగల ఒక అమెరికాస్త్రీ ఆఫ్రికా వెళ్లి ఆయనను కలసికొనెను. అప్పటికి డాక్టరు మహాశయునకు తనకృషియందు అధిక సాఫల్యము గలిగెను. ఆయన స్వేచ్ఛగా కోతులతో సంభాషించుచుండెను. తరువాతఆయన కోతులభాషకు ఒక నిఘంటువునే తయారు చేసెను.

గార్నరు సంపూర్ణనామము డాక్టరు రిచర్టు ఎల్. గార్నరు. కోతులభాష నేర్చుకొనవలయునను సంకల్పము గలిగినది మొదలు ఆయన తన అన్నిపనులు విడిచిపెట్టి ఆపనియందే మగ్నుడై ఆఫ్రికా అడవులలో సంవత్సరముల కొలది తిరుగుచుండెను. మనుష్య సంపర్కము వదలి తాను కోతులకు సహవాసిఅయ్యెను. గోరిలా, చిమ్పాంజీఅను పేరుగల కోతులు చాల భయంకరములైనవి. వానితో ఉండుట ప్రాణాపాయకరమైన పని అయినను ఆయన తనపనిని సాధించుచునేయుండెను. కృషిపరా

యణునకును, దృఢనిశ్చయమునకును, నేవి అసాధ్యములు? తుదకు ఆయన మనోరథము నెరవేరెను. ఆయన కోతుల భాష నేర్చుకొనెను. తన పనియందు సఫలతను పొందిన తరువాతనే ఆయన మరణించెను.

మనుష్యులవలె, పశుపక్షులుగూడ సంఘములుగానుండును. అవి ఒండొరులతో స్నేహభావము గలిగియుండునని వాని ప్రవర్తన వలన తెలియుచున్నది. జంతువులలో కోతులుచాల బుద్ధిగలవై యున్నవి. వాని బుద్ధిచాతుర్యము చూచిన ఆశ్చర్యమగును. ఏదైన ఒకదానికి కష్టమురాగానే అవిఅన్నియు పోగయి దానిని రక్షింపబూనును. అవి దెబ్బతిన్నవారికి పరిచర్యగూడ చాలజాగ్రత్తతో చేయుచున్నవి. అవి ఒండొరులభావమును బాగుగ తెలిసికొనగలుగునపుడే ఇట్లు చేయుటకు వీలగును గాన కోతులకుగూడ ఏదేని భాష గలదా యని యిక్కడ ప్రశ్నగలుగుచున్నది.

డాక్టరు గార్నరు కోతులభాష నేర్చుకొనుటకు బాగుగ ప్రయత్నము చేసెను. తాను మొదట కోతులపనులన్నిటిని బాగుగ పరీక్షించెను. అందుపై తాను కోతులకుగూడ భాషగలదని నిశ్చయించుకొనెను. ఒకసారి తాను ఒకతోటకు వెళ్లెను. అక్కడ ఒక పంజరములో ఒకపెద్దకోతి బంధింపబడి యుండెను. దానికి రెండవభాగములో కొన్నిచిన్న కోతులు బంధింపబడియుండెను. అవి దానివలన భయపడుచుండెను. భయపడినపిమ్మట కోతులు ఒకవిశేషవిధమగు ధ్వనిచేయుటయు, దానిని విని తక్కిన కోతులుగూడ, భయపడుటయు గార్నరు గుర్తించెను. ఇదేవిధముగ ఈయన ఒకసారి ఆఫ్రికాలో నున్నపుడు ఈయనకు ఒకకోతి కనుపించెను. అది బంధింపబడి యుండెను. దాని సహచరులు తోటయందు ఫలములుతినుటకు వచ్చునపుడు అచ్చట నేదేని భయపరిస్థితిచూచినచో అది ధ్వనిచేసి తన సహచరులను హెచ్చరికచేయుచుండెను. ఇట్టి మాటలచే గార్నరుకు కోతులు పరస్పర సంభాషణను చేయుచున్నవని విశ్వాసము కలిగెను.

ఇటలీలో మర్కటభాష నెరిగిన మరియొక పండితుడుండెను. వానివలన గార్నరుకు ఎక్కువసహాయము లభించెను. వాని దగ్గరఒకకోతియుండెను. దానిపేరు 'జిఆకేమో.' దాని యజమాని కేవలము 'జిఆక్' అని పిలచెడివాడు. డాక్టరు గార్నరు ఆకోతిని కొనగోరెను. కాని వాడు ఒప్పుకొనలేదు. వాడు, జిఆక్‌ను కౌగలించుకొని, "లేదు, లేదు; నేను దానిని ఎన్నటికిని అమ్మజాలను" అని చెప్పెను. ఆకోతిగూడ వాని అభిప్రాయము తెలిసికొనినట్లుండెను. కోతులభాషను నేర్చుకొను కోరిక గలిగినప్పటినుండి ఆయన వానియొక్క ధ్వని పైననే ధ్యాన ముంచసాగెను.

కోతులు ఒండొకటితో ఏవిధముగా ధ్వని చేయుచుండెడివో దానియొక్క సరియైన ఉచ్చారణను వ్రాసికొనుచుండెడివాడు తరువాత ఆయన వేఱు కోతులవద్దకు వెళ్లి వానిశబ్దముల ఉచ్చరించు చుండెడివాడు.

ఇట్టి దృష్టాంతముల నెన్నిటినో చూచిన పిమ్మట, ఆయన కోతులకుగూడ భాషగలదనియు అవి ఒకదానిమాట మరియొకటి గ్రహింపగలవనియు నిశ్చయించుకొనెను. ఆయన రెండుకోతులను వేఱు వేఱు గదులయందు బంధించియుంచెను. ఆయన ఒక కోతియొక్క ధ్వనిని స్వరగ్రాహియంత్రము (గ్రామఫోను)లో నింపెను. అప్పుడు ఆయన రెండవకోతి యొద్దకువెళ్లి అక్కడ గ్రామఫోనుపై ఆరికార్డు పెట్టెను. దానిని ఆకోతి విని వ్యాకులపడి నలుప్రక్కలనున్న తన సహచరులను వెదుకసాగెను. మరల ఈ కోతియొక్క ధ్వనిని నింపి మొదటి కోతి దగ్గరకు తీసికొనివెళ్లెను. దానిని విని అది కూడ అధికముగా అఱవసాగెను. గోట్టములో చేయిపెట్టి అది తన సహచరులను వెదుకసాగెను.



కోతులు మఱియొకకోతిని యుద్ధమునకు కవ్వించునపుడు ఒకవిధమైన ధ్వనిని చేయును. గార్నరు ఆధ్వనినికూడ నింపి మరియొక కోతికి వినిపించెను. కవ్వింపు వినగానే ఆకోతి కోపగించెను. మరియు అదికూడ అటులనే శబ్దముచేయుచు తన ప్రతిపక్షిని వెదుకసాగెను. ఈప్రకారము ఒక శబ్దముచే అన్నికోతులును ఒక విధమైన పనిచేయుటచూచి గార్నరు ఆశబ్దముల యొక్క అర్థములను గ్రహించెను. ఈప్రయత్నములో ఆయన కోతుల భాషయందు 'దప్పిక' అర్థముగల శబ్దమును తెలిసికొనెను. దానిని ఉపయోగించుటకు ఆయన ఒక కోతి పంజరము దగ్గరకు వెళ్లెను. ఆకోతి చాల బుద్ధిగలది. గార్నరు కోతులభాషతో 'దప్పిక'యను శబ్దము నుచ్చరింపగనే ఆకోతి పరుగెత్తుకొని తన గిన్నెను తీసికొనివచ్చెను. దానిలో పాలుపోయగా అది విశ్వాసముతో త్రాగెను. ఈఉపాయముతో ఆయన కోతుల భాషలోని వాక్యములు వాని అర్థములు తెలిసికొనెను. గార్నరు కోతులభాషను తాను నేర్చుకొనినటులనే కోతులకు మనుష్యభాషనుకూడ నేర్పుటకు ప్రయత్నము చేసెను.

ఆయనకు ఒక పెంపుడు కోతి యుండెను. దానిపేరు 'మోజేక్'. అదిఇంగ్లీషులో 'మామ' జర్మనీలో, 'బీ' మరియు ఫ్రెంచిలో 'ఫ్యు'అని ఉచ్చారణచేయుట నేర్చుకొనెను. ఫ్రెంచిభాషలో 'ఫ్యు' అనగా నిప్పు. గార్నరు ఆకోతికి నిప్పుచూపి, మాటిమాటికి 'ఫ్యు' అని చెప్పుచుండేవాడు. అందుచే

'మోజేజ్' నిష్క్రమించినపుడు 'శ్య' అని అఱచుచుండేది.



కోతులభాష నేర్చుకొనిన పిమ్మట గార్నరు వానితో బాగుగ మాట్లాడుచుండెడి వాడు. ఆయనదగ్గర ఒకఆడకోతి యుండెను.

దానిపేరు. 'సూసీ' అది ఒకసారి ఫోటో తీయబడెను. రెండవసారి మగల ఫోటో తీయ వలసియుండ అందుకది సిద్ధము గాలేదు. తరువాత గార్నరు దానికి దానిభాషలో తెలియజేసెను. అప్పుడు అది చాలకష్టముతో ఒప్పుకొనెను. ఈ ప్రకారము ఒకసారి ఆయన జంతుశాలయందు 'చిమ్పాంజీ' అను పేరుగల కోతుల పంజరము దగ్గరకు వెళ్లెను. అన్ని కోతులును, నిద్రపోవుచుండెను. ఆయన వెళ్లి వానిభాషలో 'ఊః ఊః' అని శబ్దముచేసెను. అన్ని కోతులు ఒక్కమారుగ మేలుకొనెను. మరియు గార్నరుకు జవాబుఇయ్యసాగెను. ఇతరజాతుల వలన తమభాషను విని అవి చాల ఆశ్చర్యపడెను. ఇట్టివింతలు అనేకములు జరిగెను.

సంపూర్ణము

## వేడికోలు

వెలగపూడి దానయ్యచౌదరి గారు

భవదీయమూర్తి నేనగిదిని గన్గొందు, నంచు మానసమందు నెంచుచుంటి
భవదీయపద్మములఁ బడి మ్రొక్కవలెయు న,న్వేడ్కతో నిరతంబు వేచియుంటి
భవదీయకరుణ కెట్లుగిఁ బాత్రుఁడనౌదు, నను చింతమార్గంబు నరయుచుంటి
భవదీయనామ సత్కృతనంబు ననిశంబు, మించినభక్తిఁ గావించుచుంటిఁ
గాన నీ దివ్యమూర్తిని గనఁగఁజేసి, పదములకు మ్రొక్కఁగా నిచ్చి భవ్యమైన
కరుణఁ దిలకించి సతతంబు గావుమయ్యా, పరమకరుణాలవాల, శ్రీ భక్తపాల!



# పుస్తకబంధనము

# [Book Binding]

వింజమూరి కృష్ణమాచార్యులుగారు

వ్రాతగ్రంథములుగాని, ముద్రింపబడినట్టి గ్రంథములుగాని చెదపట్టకుండుటకును, పురుగులచే నశింపజేయబడకుండుటకును, వాటి నుపయోగించునపుడు పుటలు చిరిగిపోకుండుటకును, పుటలన్నియు నెల్లప్పుడును క్రమము తప్పకుండ యుండుటకును చేయు సదుపాయమునకు పుస్తకబంధనము లేక బైండు చేయుట యనిపేరు. లోహపురేకులపైగాని రాతిపలకలపైగాని చెక్కబడినట్టి పురాతన శాసనములను గాపాడుటకు ప్రత్యేక రక్షణమేదియు అవసరము లేకుండినను, క్రమముగా తాటియాకులు భూర్జపత్రములు మొదలగు వాటిపై గ్రంథములను వ్రాయుట ఆచరణలోనికి వచ్చుటతోడనే వాటిని కాపాడు మార్గములుకూడ కనుగొనబడి యుండవలెను. వ్రాతగ్రంథములను కాపాడుటకు వివిధ దేశములందు వేరువేరు మార్గము లవలంబింపబడుచుండెడివి. దేశాచారములను బట్టియు, ప్రజల యభిరుచులను బట్టియు, నాగరికతనుబట్టియు దంతపుపని చేయబడినట్టియు, నగిషీ చెక్కబడినట్టియు, కర్రబల్లలు రేకులు మొదలగువాటిని పుస్తకరక్షణమునకు వాడుచుండెడివారు. చిత్రవిచిత్రములగు నగిషీపని చేయబడిన కర్రబల్లలతో బంధించి కాపాడబడినట్టి మనపూర్వుల తాటియాకు గ్రంథముల నిప్పటికిని మనము చూచుచునే యున్నాము. వారలీవ్రాతగ్రంథములను ప్రాణతుల్యముగా జూచుకొనెడివారు. ఇప్పటికిని పురాతనపు వ్రాతగ్రంథముల మూల్యముగా నెంచబడుచున్నవి. అచ్చుయంత్రములును, కాగితములును కనుగొనబడినపిమ్మట ప్రపంచమునందంతటను గ్రంథరూప మొక్కమారు మార్పుచెందినది. లిపిభేదము తప్ప యిపు డన్నిభాషలలోని గ్రంథములును ఒకేరూపమును దాల్చియున్నవి. ఈవ్యాసమునందు పుస్తకములను బైండుచేయు నవీనపద్ధతులుమాత్రము దెలుపబడును.

బైండుపని నభ్యసించువారు కాగితములయొక్కయు పుస్తకములయొక్కయు కొలతలను దెలిసికొనుట మంచిది. పుస్తకముల నచ్చువేయుకాగితము లీక్రింది కొలతలు గలిగియుండును.

ఫుల్‌స్కాపు 17″ × 13½″; మీడియం 24″ × 19″; క్రవున్ 20″ × 15″; డిమ్మి 22½″ × 17½″; రాయల్ 25″ × 20″; సూపర్ రాయల్ 27″ × 21″; ఇంపీరియల్ 30″ × 22″.

నిండుకాగితము నొకసారి మధ్యమునకు మడచినపుడు ఫోలియో అనియు, తిరిగి దానిని రెండవసారి మధ్యమునకు మడచినపుడు క్వార్టో అనియు, మూడు సార్లు మడచిన ఆక్టెవో అనియు, 4 సార్లు మడచిన 16 M. O. అనియు పుస్తకపు కొలతలకు పేర్లు గలవు. అచ్చువేయబడినపిమ్మట మడతపెట్టినట్టి నిండుకాగితములకు "సెక్షనులు" లేక విభాగము లనిపేరు. ఈవిభాగములు సామాన్యముగా 8,16,32 పుటలు గలిగి యుండును. అచ్చువేయబడిన కాగితములను విభాగములుగా మడచు పని సాధారణముగా ముద్రాలయములయందు జరుగుచుండునుగాన ఆవివరముల నీవ్యాసమునందు దెలుప బూనుకొనలేదు.

## పరికరములు

బైండుపని నభ్యసించుట కీక్రింది సాధన సామగ్రినికలిగి యుండవలయును.

1. మడతపెట్టిన పుస్తకవిభాగములను దగ్గరగా నొక్కు ప్రెస్సు. (ఉత్తరములకు కాపీలుదీయు ప్రెస్సు వంటిది.) Hot Press.

2. విభాగముల నన్నిటినిజేర్చి పొత్తిగా కుట్టు ప్రెస్సు. (Sewing Press.)

3. చేతిరంపము. (Hand Saw.)

4. పుస్తకపుచివరలనుకోయు కోతయంత్రము. (Cutting Press.)

5. వీపులనేర్పరచుప్రెస్సు. (Backing Press.)

6. వీపులనేర్పరచుబల్లలు, (Backing Boards.)

7. కోతబల్లలు. (Cutting Boards.)

8. సుత్తి, కత్తెర, కత్తి, సూదులు, దారము, ట్వాయిన్, జిగురు, అట్టలు, క్యాలికో, తోలు మొదలగు చిల్లరసామానులు.

చిత్రము ౧



మడతపెట్టబడిన పుస్తక విభాగములను నొక్కు ప్రెస్సు
హాట్ ప్రెస్సు.

## బైండుచేయు మార్గములు

బైండుపనిని, కుట్టుట, చివరలుకోయుట, వీపులు గుండ్రనచేయుట, అట్టలుకట్టుట, అట్టలను, పుస్తకపువీపు, లను వేర్వేరు లతలు మొదలగువాటితో నలంకరించుట యను 5 శాఖలుగా విభజింపనగును. పెద్ద బైండుషాపులందును ముద్రాలయములందును ఈశాఖలకు జెందిన పనులనుజేయుటకు ప్రత్యేకపు పనివాండ్రను నియమించెదరు.

## 1. పుస్తక విభాగములు కుట్టుట

ప్రథమమున పుస్తకముయొక్క మడత బెట్టబడినట్టి విభాగములన్నిటిని (Sections) పేజీనంబరు తప్పకుండులాగున పొత్తిపెట్టి ప్రెస్సులోనుంచి గట్టిగా మరను బిగించవలయును. ఇట్లు ప్రెస్సులో నొత్తుటవలన విభాగములన్నియు గల్లగాను రెత్తుగాను ఉండక దగ్గరగా నణగియుండగలవు. (చిత్రము ౧.)

పిమ్మట ఆవిభాగముల పొత్తినంతను ప్రెస్సునుంచి వెలుపలకుతీసి మడతలుగల వెనుక భాగమును హెచ్చుతగ్గులు లేకుండులాగున నొక్కబల్లపైబెట్టి, సుమా రొక ⅛" మాత్రము పైకి మించుగా నుండునటుల వీపుల నేర్పరుచు ప్రెస్సునందు బిగించవలయును. తరువాత పైనుండి 1½ అంగుళమును క్రిందినుండి 1½ అంగుళమును ఖాళీవిడిచి మిగిలియున్న ప్రదేశమును పుస్తకము పెద్దదైనచో 5 సమానభాగములుగను, చిన్నదైనచో 4 భాగములుగను విభజించి, పెన్సలుతో ఆనవాలుకొరకు గీతలు గీసుకొనవలెను. అనగా 4 భాగములు చేసినపుడు 5 గీతలును, 5 భాగములు చేసినపుడు 6 గీతలును ఉండవలయును. పిమ్మట యాగీతులపై చేతిరంపముతో సుమారొక నూలులోతుగాడి మట్టముగా కోయవలయును. ఇట్లు కోయబడినట్టి విభాగములలో దేనిని పరీక్షించినను దానిమడతమయము గాకుట్టుటకు వీలగునటుల రంధ్రము లేర్పడియుండును. (చిత్రము ౨, 3)

పుస్తకములయొక్క విభాగములనన్నిటని పైవిధముగాతయారు చేసినపిమ్మట వాటిని కుట్టుటకు ప్రారంభింపవలెను. ఈపనికై ప్రత్యేకపు కుట్టుప్రెస్సు ఒకటియుండవలయును. దానిరూప మిక్రింద జూపబడియున్నది. ఈప్రెస్సుయొక్క మరస్తంభములపై నుండు అడ్డుకమ్మికిని; పీటలోనిగాడికి క్రిందనుండు యినుపచకును 20 లేక 25 నూలుపోగుల నొకదారముగా మెలిపెట్టి పుస్తక విభాగములయొక్క వెనుకభాగమునందలి రంపపుకోత

లకు సరిగా నుండునటుల కట్టవలయును. అడ్డు కమ్మి క్రిందనుండు స్తంభములయొక్క మరదిమ్మలను పైకి

చిత్రము ౨




పుస్తకవిభాగములకు రంపపుగాళ్లు కోయుట

A. వీపులనేర్పరుపు ప్రెస్సు; B. పుస్తక విభాగముల పొత్తి; C. రంపము D. రంపపుగాళ్లు.

త్రిప్పుటవలన యీ దారములు గట్టిగా బిగియును. విభాగములందరి పైగాడి క్రిందిగాడి విడిచి, మాయముగా 3 గాడులున్నచో మూడు దారములును, 4 గాడులున్నచో నాలుగు దారములును కట్టవలయును. పిమ్మట విభాగముల పొత్తిలోని కడపటి విభాగముతో కుట్టు మొదలిడవలయును. విభాగముయొక్క మడతను మాయముగా విడదీసి దాని వెనుకభాగమునందు రంపపుకోత రంధ్రములు ప్రెస్సునకు కట్టినదారముల నంటియుండునటుల ప్రెస్సు యొక్క పీటపైనుంచి, సూదిలో దారముగుచ్చి తలవైపు మొదటి రంధ్రముగుండా లోపలకు పోనిచ్చి, రెండవ రంధ్రముగుండా వెలుపలకులాగి ప్రెస్సునకు కట్టిన మొదటి దారముచుట్టి, తిరిగి ఆరంధ్రముగుండానే లోపలకు గుచ్చవలయును. ఇదేవిధముగా మిగిలియున్న దారములనుచుట్టి ఆఖరు రంధ్రమునుండి వెలుపలకు దారమును రానిచ్చి, కుట్టు ప్రారంభించిన మొదటి రంధ్రమువద్ద 2,3 అంగుళములదారము మాత్రము మిగులునటులు దారమునంతను వెలుపలకు లాగివేయవలయును. ఇట్లు

చిత్రము 3




రంపపుకోతలు కోయబడిన విభాగముల పొత్తి; A. విభాగములు; B. రంపపుకోతగాళ్లు.

చేయుటవలన ప్రెస్సునకు కట్టబడినదారములు కుట్టు దారముచే చుట్టబడి విభాగముయొక్క రంపపుగాళ్లలో సరిగా నిమిడియుండగలవు. పిమ్మట మరియొక విభాగమును తీసికొని మొదటిదానివలెనే కుట్టి, దారపుకొస గట్టిగా వెలుపలకు లాగి బిగించవలయును, కాని యీ రెండుభాగములకును చివరరంధ్రమువద్ద మాత్రమే సంబంధముండనేరదు. గాన ప్రథమమున విడిచిపెట్టి యుంచిన దారపుకొసను కుట్టు దారముతో కలిపి ముడివేయవలయును. ఇదేవిధముగా మిగిలియున్న విభాగముల నన్నిటిని కుట్టవలయును. మూడవవిభాగమునుండి ప్రతిదానిని, కుట్టు చివరకు వచ్చినపిమ్మట దారమును బిగలాగి దాని క్రింది విభాగముతో సంబంధమేర్పడునటుల దారమును మెలికవైచి బిగించుచుండవలయును. ఈవిభాగములను

కుట్టుపని, కుట్టుమండగా చూచుటవలన గ్రంథములను చదువుటకంటె సులభముగా బోధపడగలదు. ౪, ౫, ౬ చిత్రములం దీకుట్టువిధము స్పష్టముగా జూపబడియున్నది.

చిత్రము ౪




కుట్టుప్రెస్సు.

A. A. మరస్తంభములు; B. అడ్డుకమ్మికి కట్టినట్టి నూలుదారములు; C. అడ్డుకమ్మి; D. D. మరదిమ్మలు E. పీట.

చిత్రము ౫




విభాగములను కుట్టువిధము (a)

A. విభాగము; B. విభాగముయొక్క పైభాగము; C. విభాగపుమడత లోపలిభాగము; D. కుట్టుదారము; E.E. E. ప్రెస్సుయొక్క అడ్డుకమ్మికిని పీటక్రిందనుండు యూచకునుకట్టి బిగించిన నూలుదారములు.

కుట్టు పూర్తిగా ముగిసినపిమ్మట విభాగములన్నియు దగ్గరగానుండుటకు వ్రేళ్లతో బాగుగాఅదిమి, వెనుకవైపు అంతట బాగుగాపట్టునటుల జిగురు (Glue) పూసి ఆరినపిమ్మట ప్రెస్సునకు కట్టబడిన దారములను యిరువైపుల 1 అంగుళము కొనలు మిగులునటుగ కత్తిరించి పైటికి తీసివేయవలయును. కుట్టుప్రెస్సు లేకుండగనే కుట్టుమార్గములు కూడ కలవుగాని, వాటినన్నిటిని యీచిన్న వ్యాసమునందు దెలుపుట యసంభవము.

## చివరలుకోయుట

విభాగములన్నియు కలిపి కుట్టినపిమ్మట కొంతవరకు పుస్తకరూప మేర్పడును. పిమ్మట చేయవలసిన పని చివరలుకోయుట. చివరలుకోయుటకు పూర్వము, పుస్తకారంభమునందు ముఖపత్రము (title page) నతికించి పటములేవైనయున్నచో వాటిని అవియుండవలసిన స్థలములం దంటించుకొని యిరుప్రక్కల రెక్కకాగితముల (end papers) నతికించవలయును. ఈరెక్కకాగితములు సాధారణముగలలోను, పలువిధముల చిత్రములను లతలతోను యిందు నిమిత్తమై ప్రత్యేకముగా తయారుచేయబడును. వాటికి మారుగా దృఢమగు తెల్లకాగితమునైనను వాడవచ్చును.

చిత్రము ౬




విభాగములను కుట్టువిధము (b)

A. రంపపుగాడులను కనపర్చువిభాగము. B. ప్రెస్సుతాడులనుచుట్టి విభాగములను కుట్టుదారముతో కుట్టువిధము. 1. కుట్టు దారము; 2.2.2. ప్రెస్సుదారములు.

పిమ్మట పుస్తకముయొక్క వెనుకభాగముతప్ప మిగిలిన మూడువైపుల చివరలు తగుమాత్రము హెచ్చు తగ్గులు లేక చట్టముగా నుండునటుల చేతికోత ప్రెస్సులోగాని కోతయంత్రమునందుగాని కోసివేయవలయును. అచ్చువేయునపుడు పుస్తకవిభాగముల కన్నిటికిని, ముద్రిత

భాగమునకు నలువైపుల కొంత అంచు ఖాళీగా వదలి వేయబడును. ఈ ఖాళీభాగమే పుస్తకపు చివరలుగా నేర్పడును. కోతయందు వంకరగాని కైడాగాని వచ్చినచో, ముద్రితభాగమునకు చుట్టునుండు ఖాళీసమముగా నుండక చూచుట కసహ్యముగ నుండును

ముద్రాక్షరశాలలయందును, పెద్దబైండుషాపులందును, పుస్తకపు చివరలను కోయుటకు కోతయంత్రములుండును. వాటియందు గంటకు వందలకొలది పుస్తకములు చెప్పిన కోయవచ్చును. కొద్దిపాటి బైండుపని చేయువారును, యీపనిని వృత్తిగా పెట్టుకొనక విలాసార్థముగ తమ స్వంతపుస్తకములను మాత్రము బైండు చేసుకొనువారును, కోతయంత్రములు హెచ్చువెల గలిగియుండుటచే కత్తిరకోతప్రెస్సును వాడుక చేయుచుందురు. కోతయంత్రముయొక్కయు యీకత్తిరకోతప్రెస్సుయొక్కయు రూపము లీక్రిందిచిత్రములందు జూపబడియున్నవి.

కత్తరకోతప్రెస్సునందు పుస్తకపు చివరల నీక్రిందివిధముగా కోయవలయును. పుస్తకముయొక్క వెనుకభాగముతప్ప మిగిలిన మూడువైపుల ఖాళీప్రదేశము (margin)నందెంతవరకు కోతవేయుట అవసరమో నిర్ణయించుకొని, అచ్చట పెన్సిలుతో ఆనవాలుకొరకు వట్టముగా గీతలు గీయవలయును. పిమ్మట పుస్తకములయొక్క ముందుదిక్కునుండి ఎంతవరకు కోతవేయవలయునో సూచించు గీతకు సమముగా నొక కోతబల్లను (Cutting Board) పుస్తకముతో సమముగా వెనుకభాగమున మరియొక్క బల్లను పెట్టి కోతప్రెస్సు దిమ్మలను విడదీసి వాటి మధ్యముగా కదిలిపోకుండ పెట్టి, గట్టిగా మరలను త్రిప్పి బిగించవలయును. చివరనుండి కోతవేయు భాగమును సూచించు గీతయు దానితో సరిగా పెట్టినట్టి కోతబల్లయొక్క పైభాగమును, ప్రెస్సుదిమ్మలయొక్క పైభాగములతో సరిపోవలయును.

చిత్రము ౧



కోతయంత్రము.

చిత్రము ౨




కత్తరకోతప్రెస్సు.

A. A. ప్రెస్సుదిమ్మలు; B. B. దిమ్మలను బిగించు మరలు; C. కోతకోయుచిత్రిక. D. చిత్రికనుముందువెనుకలకు నడుపుమర.

పిమ్మట వెనుక నిమ్మయంచవలిగాడిలో త్రాసుచిత్రికోనంటి కోత సాధనమునకు మాయముగానుండు మరను రెండుచేతులతో పట్టుకొని కొంచెము కొంచెముగా దగ్గరకు త్రిప్పుము, ముందునకును వెనుకకును చిత్రిక తోము నటుల తోయుచు వచ్చుటవలన, పుస్తకపుచివర సరిగా గీతవద్దకు తెగగలదు. ఇదే విధముగా మిగిలిన రెండుచివరలనుకూడ కోసవేయవలయును. కుట్టుటవలెనే యీ కోతయు, పనిచేయునపుడు చూచుట వలన సులభముగా బోధపడగలదు.

చిత్రము ౯




వీపుల నేర్పరచుట.

A. A. ప్రెస్సుదిమ్మలు. B. B. వీపు నేర్పరచుటవలన వంగినట్టి పుస్తకపు కొనములు. C. అర్ధవలయాకారముగ చేయబడిన పుస్తకపువీపు. D. D. బ్యాకింగ్ బల్లలు.

## వీపులనేర్పరచుట [Backing]

పుస్తకములకు చివరలు కోసివేయబడినపిమ్మట వాటివీపులను అర్ధవలయాకారముగా నుండునటుల చేయవలసియుండును. ఈపనికి వీపుల నేర్పరచుటలే క బ్యాకింగు[Backing]అనిపేరు. వీపుల నేర్పరచనిచో, పుస్తకములు చూచుట కందముగా నుండకపోవుట మాత్రమేకాక చదువుట కంత వీలుగాగూడ నుండనేరవు. వీపుల నేర్పరచువిధ మీక్రింద దెలుపబడి యున్నది.

పుస్తకమునకు వీపు నేర్పరచుటకు ముందుగా దాని వెనుకభాగమును అర్ధవలయాకారముగను ముందు భాగమున నదేవిధమైన పల్లముగను, వచ్చులాగున చేతి వ్రేళ్లతో నదిమిపట్టుకొని, Backing Boards అన బడు కొయ్యపలకలను వీపునకు $\frac{1}{8}$ అం. క్రిందుగా నిరువైపులను యీక్రిందిపటమందు జూపబడినటులుచేర్చి ప్రెస్సులో బిగించవలయును. పుస్తకవిభాగములకు రంపపుగాట్లు కోయునపు డుపయోగించిన ప్రెస్సు యీవీపుల నేర్పరచుటకుకూడ పనికి వచ్చును.

పిమ్మట సుత్తితో వీపుభాగమునంతను పటమునందు జూపబడినటుల నున్నగను అర్ధవలయాకారముగను వచ్చునటుల బాగుగాకొట్టిజిగురుపూసి, తలవైపున క్రింది భాగమున $\frac{1}{8}$ అంగుళము తక్కువగాను యిరుప్రక్కల అంగుళము హెచ్చుగాను నుండునట్టి పలుచనిగుడ్డ నొకదాని నతికించవలయును.

## అట్టలు కట్టుట

పుస్తకములకు వీపుల నేర్పరచినపిమ్మట మిగిలిన పని వాటికి అట్టలను కట్టుట. తోలుతో బైండుచేయునపుడును హెచ్చువెలగల పుస్తకములకును మిల్ బోర్డులనబడు అట్టలను (Mill Boards)సాధారణపు పనికంతకును గడ్డిఅట్టలును (Straw Boards) వాడుకచేయబడుచున్నవి. గడ్డిఅట్టలు 25 × 30 అం. కొలతగలిగి యొక్కొకఅట్ట $\frac{1}{8}$ పౌనుమొదలు 3 పౌనులవరకు బరువు గలిగియుండును. వీటిబరువు హెచ్చుచుండిన కొలది దళసరికూడ హెచ్చుచుండును. పుస్తకముయొక్క లావునుబట్టి అట్టలయొక్క మందమును నిర్ణయించుకొనవలయును. సాధారణముగా 1 అంగుళముకంటె తక్కువలావుగల పుస్తకములకు 1 పౌను అట్టలును అంతకుమించిన లావుగలవాటికి 2 పౌనుల అట్టలును వాడబడుచున్నవి.

పుస్తకపు లావునకుతగినట్టి అట్టనొకదానిని తీసుకొని, దానినుండి పుస్తకపు కొలతకంటె వీపుతప్ప మిగిలిన మూడువైపుల 3/16 అంగుళము (మూడునూళ్లు) మించియుండులాగున రెండుముక్కలు తెగగొట్టవల

యును. పిమ్మట వీపుల నేర్పరచుటవలన పైకి పెరిగిన కోణములకంటునటుల పుస్తకమున కిరువైపుల యీఅట్ట ముక్కలను అన్నివైపుల సమానమగు మించుఉండు లాగున జేర్చి తాడుతో కదలకుండ కట్టవలయును. పిమ్మట పుస్తకపు వీపునందలిరంపపుగాళ్లనుండి పైకిమిగిలినట్టినూలుదారపు కొసలకుసరిగా అట్టలచివర పైనుంచి యేటవాలుగా బెజ్జములుచేసి, ఆబెజ్జములగుండా నూలుదారముల కొసలనుదోపి, పైకిలాగి అట్టల కతికించవలయును. ఈ క్రిందిచిత్రమును చూడుడు. ,

చిత్రము ౧౦




పుస్తకమున కట్టల నతికించుట.

A. పుస్తకము;B. B. B. పుస్తకపువీపునందలి రంపపుగాళ్లలోని అట్టల కతికింపబడిన నూలుదారములు. C. C. అట్టలు. D. అట్టలపైన కప్పుతోలు.

తోలుతో బైండుచేయునపుడును, పుస్తకము మిగుల భారముగా నున్నప్పుడును మాత్రమే పైవిధముగా అట్టలను ముందుగా పుస్తకమున కతికింతురు. క్యాలికో గుడ్డతో బైండుచేయునపుడును చిన్న పుస్తకములకును యిట్లు గావింప నవసరముండదు.

## తోలుతో బైండుచేయుట

పుస్తకములను బైండుచేయుటకు పనికివచ్చు తోలునం దనేకరకములు గలవు. సాధారణముగా బాగుచేయబడినట్టి మేకచర్మములును గొర్రెచర్మములును తరుచు వాడుకచేయబడును. పెక్కురంగులలో లభ్యమగు మొరాకోయనబడు తోలును హెచ్చువెలగల పుస్తకములకుమాత్రము వాడుదురు. పైన తెలిపినటుల పుస్తకమునకు అట్టల నతికించినపిమ్మట పుస్తకమునంతను కప్పి అన్నివైపుల అట్టలకంటె 1 అంగుళము మించియుండునంత తోలుముక్కను కత్తిరించి దానికంతకు మంచిజిగురుగల పిండి రాసి, ముందుగా నొకయట్టపై నంటించి, వీపునకు సరిపడునంత సన్నని అట్టకాగితపుముక్క నొకదానిని కత్తిరించి వీపుభాగమును కప్పుతోలుపై నంటించి, మిగిలియున్నతోలును రెండవఅట్టపై గట్టిగాలాగి అంటించవలయును. పిమ్మట అట్టలకంటె మించుగానుండు తోలుయొక్క మూలలు కత్తిరించి లోపలకు మడిచి, పుస్తకమునకు లోగడ అంటించియుంచిన రెక్కకాగితపుపైపొరలను, వీపునకు అంటించిన గుడ్డయొక్క మించులను అట్టలకు అంటించవలయును. ఇంతటితో అట్టలకట్టు పని కొంచెమెచ్చుతగ్గుగా ముగిసినదని చెప్పవచ్చును. ఇక చివరకు మిగిలియున్నపని అట్టలపైనను వీపులపైనను చిత్రములు పుస్తకపుపేర్లు మొదలగునవి చిత్రించుట. పుస్తకములను నిండుతోలుతో బైండుచేయుటకుమారుగా వీపులకును అట్టల చివరలకును తోలును మిగిలినభాగములకు క్యాలికోగుడ్డయును కూడ నుపయోగింప వచ్చును. ఈవిధముగాచేయుపనికిసగము తోలుబైండుఅని పేరు.

## క్యాలికోగుడ్డతో బైండుచేయుట

హెచ్చువెలలేనట్టియు అంత భారముగా నుండనట్టియు పుస్తకములను బైండుచేయుటకు తోలునకు మారుగా పెక్కురంగులలోలభ్యమగు క్యాలికోయనబడు గుడ్డ వాడుదురు. క్యాలికో నంటించుటకు తోలునకువలె పిండిగాక సరేసులేక వజ్రముఅనిపిలువబడు జిగురు (Glue) మాత్ర ముపయోగింపవలయును. తోలు బైండునకువలె అట్టలను ముందుగా పుస్తకమునకు తగిలించుట కూడ యనవసరము. పుస్తకమునకు సరిపడు క్యాలికో గుడ్డ ముక్కపై జిగురుపూసి, దానిమధ్యముగా వీపంత కొలతగల సన్నని అట్టముక్క నొకదాని నతికించి, దాని కిరువైపుల 3/16 అం. ఖాళీవదలి అట్టల నతికించి మించుగానుండు చివరలను లోనికి మడిచివేయవలయును. పిమ్మట యీ అట్టలలో పుస్తకమును సమముగానుంచి రెక్కకాగితపు పొరలను వీటి కతికించవలయును.

### అట్టలపై లతలు, పేరులు, మొదలగునవి వేయుట

పుస్తకములను తోలుతోగాని క్యాలికోతోగాని బైండుచేసినపిమ్మట చేయవలసినపని వాటిపై లతలు, గ్రంథనామములు, మొదలగునవి చిత్రించుట. ఈపనిని సామాన్యముగా ముద్రాక్షరశాలలందు యంత్రసహాయమున చేయుచుందురు. అట్టలపైనను, వీపు భాగములందును, ఏవిధముగ చిత్రింపవలయు ననుకొందుమో అదే విధముగ లతలు, రూళ్లు, అక్షరములు మొదలగు సీసపు దిమ్మలను ముద్రాయంత్రముయొక్క చట్టమునందు బిగించి, కాగితములపై ముద్రించునటులే పుస్తకపు అట్టలపై ముద్రించెదరు. పిమ్మట వీటిపై సిరా ఆరుటతోడనే వాటిని పుస్తకపు రెక్కకాగితముల కతికించెదరు. అట్టలపైనను, వీపులకును, బంగారురేకులతో పేర్లు లతలు మొదలగునవి వేయవలయుననిన, ప్రత్యేకపుపనిని ట్లుండవలయును. అట్టల నతికించిన పుస్తకమును ప్రెస్సులో బిగించి బంగారురేకులను (Gold leaf)' సన్నని పేలికలుగా కత్తిరించి పేర్లు, లతలు మొదలగునవి వలయుచోట్ల కోడిగ్రుడ్డుసొన తగుమాత్రము రాచి, దానిపై జాగ్రత్తగా నుంచవలయును. పిమ్మట ఇత్తడియక్షరములతో కూర్చిన పేర్లు, లతలు మొదలగు దిమ్మలుగల పనిముట్లను నిప్పులలో కాచి, బంగారురేకుముక్కలు గలచోట్ల గట్టిగా నొక్కవలెను, దిమ్మలయొక్క వేడికి బంగారురేకు కరగి నొక్కబడిన భాగములందు చక్కగా నంటుకొనును. నొక్కబడనిభాగములందు కరగక మిగిలియుండు రేకును మెత్తని గుడ్డతో తుడిచిన రాలిపోవును. ఈపనిని చేయుటకు అభ్యాసము నేర్పును ఉండవలయును. బైండుచేయుటకు వలయు పరికరములన్నియు కలకత్తాయందలి Calcutta Book Binding Materials Trading Co., 68 Baitkhana Road వద్దను ముద్రాయంత్రములు, టైపులు మొదలగు సామానుల నమ్ము యితర కంపెనీలవద్దను లభ్యముకాగలవు.

---

## బుద్ధదేవుని యుపదేశ రత్నములు

రాజావాసిరెడ్డి శ్రీ దుర్గా సదాశివేశ్వర ప్రసాదుగారు

తలఁపు కెక్కినదానినే పలుకుచుండు
పలికినంతయు నేఁబూని సలుపుచుండు
నామనోవృత్తమే యిట్లు నాకుఁ గూర్చె
నన్నసువిచార సంపదల్ చెన్నుమీఱ.

వీఁడు తిట్టెను కొట్టెను వీఁడు గెలిచె
దోఁచుకొనెవీఁడు నన్నని దుఃఖపడెడు
వారి కడఁగదు క్రోధ మీ వ్యసనములను
జిక్కుకొనదేని వైరముఁ జేరదతఁడు.

ద్వేషము శమింప దెన్నఁడు ద్వేషమునను
సంతతప్రేమచే నది శాంతినొందు
నాదికాలమునుండియు నలరుచున్న
సత్యసిద్ధాంత మిదె సుఁడీ శ్రమణులార!

జనుఁడు విషయేచ్ఛ విడిచి సంసారమందుఁ
దిరుగుచో నింద్రియములు స్వాధీనములగు
నిట్టి శ్రద్ధాళులను నిర్జితేంద్రియులను
భూరిసత్త్వుల మారుఁడు చేరరాఁడు.

సంయమిజితేంద్రియుఁడు గుణి సత్యవాది
యగునరుఁడె కావిఁగట్టగా నర్హుఁడవని
నన్యుఁడు పవిత్రమగుకావి నంటినేని
సత్యనియమముహాసియించు జడుఁడెవాఁడు.

తల్లక్రిందుగ ధర్మపదంబునెల్లఁ
జదువుగాక జనుండట్లు సల్పఁడేని
యతఁడు భిక్షువుగాఁగూడ నట్టివాఁడు
పరులయావుల లెక్కించు ప్రజుఁడువాఁడు.




గండికోట సత్యనారాయణమూర్తి గారు, యమ్. ఏ.

[వెనుకటి సంచిక తరువాయి]

## ౬. యంత్రకళలు.

ఈపనిము మన మెన్నియోమార్లు ఉపయోగించినదైనను యంత్రకళలగూర్చి ప్రత్యేకముగా కొంచెము విచారింపవలసియున్నది. యంత్రకళ లనగా యంత్రముల సహాయమున నూలువడకుట, బట్టలు నేయుట, లోహములను కరగించుట మొదలగుక్రియలు, యంత్రసహాయమున్నచో వస్తురచన అతిత్వరితముగను సులభముగను అధికముగ అగుననుసంగతి అందరకు తెలిసినదే. కాళ్ళతో నడిచి ప్రయాణము చేయుటకంటె ఎద్లబండ్లు జట్కాలు, గుర్రపుబగ్గీలు, వీటి నెక్కిపోవుట త్వరితగమనముగద; ఇంతకన్నను ఆవిరి విద్యుచ్ఛక్తులచే బోవు బండ్లు ఎన్నియో మడుంగులు మేలు. చేతిమగ్గములతో దినమున కొకబట్టను నేయుటకూడ కష్టసాధ్యము. యంత్రములతో గంటకు వందలకొలది బట్టలు నేయవచ్చును. అమానుషములగు పనులెన్నియో యంత్రసహాయమున చక్కబడుచున్నవి. దేశపుటార్థికాభ్యుదయమునకు యంత్రకళాప్రాబల్యమే మూలకారణమని ఈకాలపు దేశచరిత్రలు ఘోషించుచున్నవి. కావుననే యంత్రోపకరణరూపకంబైన మూలధనమే అర్థోత్పత్తికి ముఖ్యాధారమని వెనుకటిప్రకరణములో నొక్కి చెప్పితిమి. స్టీమింజన్, స్టీంబోట్, ట్రాంకార్, రైల్వే, టెలిగ్రాఫ్, టెలిఫోన్, ఎయిరోప్లేన్ మొదలుగాగల యానసౌకర్యములన్నియు యంత్ర సహాయమునగదా నడచుచున్నవి. ప్రజలకు వీటివలన కలుగులాభములు, సదుపాయములు గణనాతీతములు. బహుత్వరితముగ రాకపోకలొనర్చుటకు ఒకస్థలమునుండి ఇంకొక ఎట్టిదూరస్థలమునకైన వార్తల నంపుటకు, వాణిజ్యవ్యాప్తికి, సరకుల నొకస్థలమునుండి ఇంకొకస్థలమునకు ఎగుమతిచేసి క్షామబాధల నివారించుటకు, అపక్వపదార్థముల నుత్పత్తిస్థానముల నుండి కర్మాగారములకు తీసుకవెళ్లి అచ్చటనవి పరివర్తనముబొంది వస్తువులుగ తయారుకాగానే వాటిని నానాప్రదేశములందుండు వినియోజకులకడకు తీసుకవెళ్లి వారి వాంఛలను తీర్చుటకును యంత్రసహాయమున నడుచు యానసౌకర్యములుగదా కారణభూతము లగుచున్నవి. విజ్ఞానరసాయనశాస్త్రాభివృద్ధియు, నాగరికతాభివృద్ధియు అగుచున్నకొలది యంత్రప్రాబల్యమతిశయించుచుండును. వ్యవసాయాదికృషులు, వస్తురచనక్రియలు, వాణిజ్యవ్యాప్తి ఇవిఅన్నియును కొద్దిగనో గొప్పగనో యంత్రసహాయమునే అపేక్షించుచున్నవి. ఈయంత్రముల నన్నిటిని క్లుప్తముగా వర్ణింపబూనినను ఒకగ్రంథమగునుగాన అట్టిసాహసమునకు దొడంగుట కిది స్థలముగాదు. వీటిప్రాబల్యముననే అర్థోత్పత్తి అనేకవిధముల నతిశయించి పాశ్చాత్యులు జపాన్‌వారున్ను మిగుల భాగ్యవంతులైరి. యంత్రకళాప్రాబల్యము ఆదేశములందువలె మనహిందూదేశమం దంతగా లేకున్నను మనవారుకూడా ఆవిషయమున పూర్తిగా ఏమరియుండలేదని చెప్పవచ్చును. మనదేశములోకూడ యంత్రశాలలు, మిల్లులు, కార్ఖానాలు, ఫ్యాక్టరీలు కొన్ని గలవు. ఈసందర్భమున మనదేశముయొక్క యంత్రరూప మూలధన ప్రవృద్ధిని దెలుపుసంగతుల వివరములను కొన్నిట నిచ్చట పొందుపరచెదము. మనదేశమందలి పెద్దమిల్లులు కార్ఖానాలు ఫ్యాక్టరీలుకలసిమొత్తము5,312. ఇందుగవర్నమెంటువారి యాజమాన్యమున పనిచేయుజనులసంఖ్య 123695. ప్రతిదినము మొత్తమువీద 13,69,136 మంది మిల్లులలో పనిచేయుచున్నారట. బంగాళదేశములో పెద్దమిల్లులు కార్ఖానాల సంఖ్య మొత్తము 1,000; వీటిలో 8,82,515 మంది పని

